Registered No. M-4345.

# యుద్ధ సంచిక.

వాల్యూం I.] మద్రాసు : 1941 వ సం॥ ఆగస్టు నెల 22 వ తేది శుక్రవారం [నె 23 రు

## 1940—1941.

## రెండేండ్ల యుద్ధం లాభనష్టాలు.

ఈ ఆగస్టు నెలాఖరుకి హిట్లరు ప్రారంభించిన యుద్ధం రెండేండ్లు ముగుస్తుంది. ఈ రెండేండ్లలో ఉభయపక్షముల వారికి లాభ నష్టాలు తైఫారువేయు వివరములు యీ దిగువ గలవు :—

### 1. అక్ష రాజ్యాలు (జర్మనీ, ఇటలీలు).

#### 1940 వ సంవత్సరములో

##### (అ) విజయములు.

1. హిట్లరు అతివడిగా పోలండును ఆక్రమించెను, కాని మిత్రమండలివారు ప్రమాదం గుర్తించలేను. వారి వుదాసీనతనుచూచి హిట్లరు ఒక్కమారుగా పెద్ద యుద్ధం ప్రారంభించెను.

ఫలితం.—నార్వే, నెదరులండ్సు ఫ్రాంసు ఆక్రమించెను. బ్రిటనుకు ప్రమాదం హెచ్చెను.

2. ఇటలీకూడ దోపిడిలో భాగం పంచుకోవచ్చింది. సోమలిలాండును బ్రిటిషువారు ఖాళీచేసిరి.

3. రష్యా తటస్థంగానుండెను, కాని జర్మనీకి అనుకూలమే. ఇతర తటస్థదేశాలుకూడ జర్మనీ దాష్టీకంగాంచి దాని కనుకూలంగానే తలలు వంచుచుండేవి.

4. రుమేనియా అక్ష-రాజ్యాలతోచేరి తన నూనెగనులను చాలవరకు జర్మనీకి ఒప్పగించెను. బాల్కను తటస్థ రాజ్యాలనుండికూడ జర్మనీ నూనె తెచ్చుకుంటూఉండెను.

5. ఫ్రాంసు రేవులను జర్మనీ ఆక్రమించుటచేత బ్రిటనుకు దిగ్బంధం జర్మనీ ప్రకటింపగల్గెను.

#### 1941 వ సంవత్సరములో

##### (అ) నిరోధములు.

1. బ్రిటనుకు ప్రమాదం తొలగి జర్మనీకి, జర్మనీ ఆక్రమించిన దేశాలకు బ్రిటిషువారు దాడిచేతురను ప్రమాదం యెక్కువైంది. రెండువైపుల జర్మనీ యుద్ధం చేయవలసివచ్చింది. ఆక్రమిత దేశాలలో సంపదంతా తొలగి జర్మనీకి అర్థికభారంగానున్నాయి, ఆందోళనకు కారణమైనాయి.

మిత్రమండలి దేశాలలో వుదాసీనత తొలగి స్థిరసంకల్పం యేర్పడింది.

2. ఇటలీకూడ జర్మనీ ఆక్రమించిన దేశంగా మారింది. ఇటలీ ఆఫ్రికాలో తన సామ్రాజ్యాన్ని పోగొట్టుకొంది. మధ్యధరాసముద్ర యుద్ధంలో తన నౌకాదళమును విమానదళమును విశేషంగా నష్టపొందింది. ఆల్బేనియాలో గ్రీకులచే ఓడింపబడింది. ముసోలోని దురాశవలన ఇటలీ అదివరకార్జించిన గౌరవమంతా గోల్పోయి నిందలపాలయ్యెను. మధ్యధరాసముద్రమునందు, మధ్యప్రాచ్యమునందు బ్రిటిషువారి శక్తి నేడు అధికమయి ఇటలీకి ప్రాణసంకటంగానుంది.

3. నేడు జర్మనీ బ్రిటిషువారి నౌకాశక్తిచే చుట్టివేయబడి, తన సైనికశక్తినంతా రష్యాపై మరల్చెను. లోపాలతో నున్నదనుకొన్న బ్రిటిషువారి దిగ్బంధమే యిపుడు హిట్లరుకి, అతని నాజీపార్టీకి అతని దురాశ లన్నింటికి మారణయంత్రంగా పరిణమించగలదు.

బ్రిటనే చివరకు గెలుస్తుందని తటస్థదేశాలకు నమ్మకం కలిగింది. గ్రీసు, యుగోస్లోవియాలు జర్మనీపై తిరుగబడినవి, యింకను తిరుగబడగలవు. టర్కీని సర్వదా జర్మనీ బెదిరిస్తున్నను బ్రిటిషువారితో ఒడంబడికను పాటించుచున్నది. దక్షిణ అమెరికా స్వతంత్ర రాజ్యాలు తమ దేశాలలో నాజీ కుట్రలను అణచివేసినవి.

4. రుమేనియా మూడోవంతు దేశభాగమును గోల్పోయింది. పంటలన్ని జర్మనీకి ఎగుమతయి ప్రజలు తిండిలేకుండా యున్నారు. జర్మనీ యుద్ధంలో పూర్తిగ దిగవలసివచ్చింది. వారి చమురు గనులను రష్యనులు బాంబులువేసి ధ్వంసముచేసిరి. దేశం సంపదంతా పోయింది.

బాల్కను రాష్ట్రములు యుద్ధరంగంగా మారుటచేత సుభిక్షమగు దేశం పాడయి, జర్మనీకే సరకు స్లైపై తగ్గిపోయింది.

5. అందుచే అట్లాంటికు సముద్ర యుద్ధం ప్రారంభమయి, యిపుడు బ్రిటిషువారు గెలుస్తున్నారు. బ్రిటను నౌకామార్గాలు ఎన్నడు మూయబడలేదు. అట్లాంటికు సముద్రంలో జర్మనీ సబ్‌మెరైనులు, పెద్ద యుద్ధనౌకలును, ముంచబడినవి. మిగిలియున్న జర్మను యుద్ధనౌకలు రేవులలోనే దాగొనవలసివచ్చెను.

## 1940

6. జర్మనీ మెరపు యుద్ధం ప్రపంచాన్నంతటిని భ్రమింపచేసెను. జర్మనుసైన్యం జయింపరానిదిగ తోచెను.

7. యుద్ధ సామగ్రి అన్నిరకాలు జర్మనీ ఎక్కువగ తయారుచేస్తుండెను.

8 హిట్లరు గూఢచారులు (5 వ పంక్తివారు) యితర దేశాలలో నిరాఘాటంగా కుట్రలు సాగించిరి.

### (అ) ముందు సంగతి :

1. 1940 వ సంవత్సరము శీతకాలంలోగానే జయించగలనని జర్మనీ నమ్మియుండెను.

2. జర్మనీ విమానశక్తి బ్రిటిషువారి మహత్తరమగు నౌకాశక్తిని మించేటట్లుండెను.

3. జయించేపక్షాన్ని చేరే అభిలాష ఇతర దేశాలకు మెండై జర్మనీశక్తి అధికమగుచు, వారి టాంకుదళములు జయింపరానివిగా అగుపడుచుండెను. అయినా,

4. యూరోపుఖండ దిగ్బంధం ఇంగ్లాండు కొనసాగించెను.

5. ఇంగ్లాండుకి హిట్లరు పంపిన శాంతిసందేశం తృణీకరించబడింది.

6. ఇంగ్లాండుపై దాడిచేయుటకు జర్మను విమానదళమునకు సాధ్యం కాలేదు. ఇంగ్లాండులో జర్మనుగూఢచారులు చేరలేకపోయిరి.

7. బ్రిటన్పై జర్మనుదాడి సెప్టెంబరు 16 వరకు వాయిదా పడింది.

8. మధ్యధరా సముద్రంలో బ్రిటిషువారి అధికారం యింకా యున్నందుకు, ఈజిప్టులో వారి సేన చెక్కుచెదరనందుకు ఇటలీకి ఆశాభంగమయింది.

### (ఇ) మొత్తంపై స్థితి.

మొత్తంపై జర్మనీ యుద్ధం త్వరలో ముగించాలనుకున్నది. బ్రిటను విషయంలోతప్ప యితర దేశాల విషయంలో అట్లు చేయగల్గెను.

## 1941

6. మెరుపు యుద్ధానికి తగిన ఉజ్జీగ రషియా ఎదుర్కొన్నది. జర్మను సైన్యాలను మించిన సైన్యాలు ఎక్కువ ఆయుధ సంపత్తిగలవి డీకొన్నవి. జర్మను సైన్యాలు జయింపరానివన్న డా॥ గోయిబెల్సు మాట అసత్యమని రుజువయింది.

7. ఆక్రమించిన దేశాలలో ఆయుధ ఉత్పత్తి చేర్చికూడ జర్మనీ ఎంత తయారుచేయగలదో ఆ గరిష్ఠ పరిమాణము అపుడే చేరెను. బ్రిటిషువారి ఉత్పత్తి యింకను నానాటికి పెరుగుచునే ఉంది. దీనికితోడుగా అమెరికానుండి సామ్రాజ్య దేశాలనుండి సరకు వస్తున్నది. రషియాతో యుద్ధంలో జర్మనీ ఆయుధసంపత్తియంతా త్వరగ తగ్గిపోవుచున్నది.

8. ఉక్రైనులో జర్మను గూఢచారుల కుట్రలు పూర్తిగ విఫలమైనవి. బ్రిటను జయించగలదను నమ్మకం ఆక్రమిత దేశాలకు కలిగింది. అందుచే యీ గూఢచారుల ప్రచార సాధకము ఎవరు ప్రయోగించిరో వారికే తిరిగి హానిచేయగలదు.

### (ఆ) ఏమి జరిగింది :

1. ఇప్పుడుకూడ సీతకాలంలోగానే జయించగలం అని జర్మనులనుకుంటున్నారు. కాని జయంకాక "శాంతి చేకూరుతుంది" అని ఆశిస్తున్నారు. అది నిస్పృహతో కలిగిన ఆశ. ఎట్లా శాంతించునో వారు చెప్పలేకుండా యున్నారు.

2 సన్నని సముద్రాలలో బ్రిటిషు నౌకాశక్తిని శత్రు విమానశక్తి కొంతవరకు నిరోధించెనుకాని నిరుపయోగం చేయలేకుండెను. మహాసముద్రాలందు నౌకాశక్తియే మిన్నగానుంది.

3. ఇందు కనుకూలంగా జర్మనీచేస్తున్న ప్రచారమంతా రషియా నమ్మక దూరముగాసుండెను.

4. దిగ్బంధం కొనసాగుచునే యున్నది. రాయలు నౌకాదళమునకు అధికంగా యుద్ధ నౌకలు విమానాలు చేర్చబడినవి. విదేశపు మార్కెట్టులనుండి సరకు నిలచిపోయినందున, రషియాను కొల్లగొట్టి లూటీచేయుటకై రషియాపై హిట్లరు యుద్ధం సాగించెను.

5. "హిట్లరుతోగాని, అతని గాంగువారెవరితోగాని మేము ఎప్పుడు సంధిరాయబారములు జరుపము" అని జూలై 22 వ తేదిన బ్రిటను తరఫున చర్చిలుగారు ఖచితంగా చెప్పేరు.

6. రాత్రులందు గురిలేని బాంబు లచ్చటచ్చట వేయడం తప్ప జర్మను విమానాలు ఏమీ చేయలేకున్నవి. ఇపుడవి రక్షించుకోడంతో సరిపోతున్నది. విమానయుద్ధం ఇంగ్లాండు నుండి ఫ్రాంసు ఉత్తరభాగం జర్మనీలమీదకు జరిగింది. ఇంగ్లాండులోనికి 5 వ పంక్తి వారెవ్వరు చేరలేకుండిరి.

7. జర్మను దాడి ఎప్పటికి రానేలేదు. బెదిరించడం మాత్రం సర్వదా ఉంది. కాని జర్మనీ ఆక్రమించిన దేశాలపై బ్రిటిషువారి దాడియే యిపుడు జరుగుచున్నది.

8. గత యుద్ధంలో మిత్రమండలి నారికెట్లు ఇటలీ భారమయిందో ఇపుడు జర్మనీకి అట్టిబరువే అయింది. ఇటలీ వారిదగు సోమలిలాండు, అబిసీనియా, ఇరిట్రియా, సిరియాలను బ్రిటిషు సామ్రాజ్యసేన లాక్రమించియున్నవి.

### (ఇ) మొత్తంపై స్థితి.

ఈ యేడాదిలో త్వరగా ముగించాలనే జర్మనీ యెత్తులు విఫలమయినవి. బ్రిటను తన శక్తిని వృద్ధిచేసుకుంటూ జర్మనీని ఎదిరిస్తూనేయుంది. ఇటలీ ఓడిపోయింది. సూయజుకాల్వపై దాడులను జర్మనుల యత్నంకూడా చెడింది. ఇపుడు వారి సేనలు రషియా యుద్ధరంగమున అగచాట్లు పడుచున్నవి. అటు రషియాను ఇటు ఇంగ్లాండును ఎదుర్కోవాలని ఖిలిల్లుచున్నారు.

2. బ్రిటను.

## 1940

### (అ) అపుడు ఇంగ్లాండు ఒకర్తే.

1. యూరోపులో ఇంగ్లాండుకి మిత్రులు లేకుండిరి. ఇంగ్లీషు ఛానలు అవతలి రేవులు శత్రువు ఆక్రమించెను.

2. ఫ్రాంసుకు పోయిన బ్రిటిషు సైన్యం తప్పించుకొంది కాని ఆయుధాలను గోల్పోయింది. తమ సెదుర్కొన్న ప్రమాదమును బ్రిటిషు జాతి యిపుడే గుర్తించెను. ½ వంతు ప్రజ సైన్యములో చేరిరి.

3. యూరోపు ఖండం దిగ్బంధం చేయబడెను. కాని అందుకు తగిన నౌకాబలం లేకుండెను. అక్షరాజ్యాలు కూడా ఇంగ్లాండుకు దిగ్బంధంచేయ ప్రారంభించినవి.

4. ప్రతిరోజు బ్రిటనుపై దాడి వస్తుందనే ఎదురుచూస్తూ ఉండిరి. కాని గుమిగూడిన శత్రు నౌకలన్నింటిని రాయలు విమానాలు చేదించుచుండెవి.

5. జర్మను విమానాల శక్తి వైమానికుల నేర్పుకన్న బ్రిటిషు విమానాల శక్తి వైమానికుల నేర్పు ఎక్కువని రుజువయింది. కాని శత్రు విమానాల సంఖ్య చాల అధికంగానుండెను.

6. అమెరికా సహాయంచేయడానికి యిష్టపడుచుండెను కాని, యుద్ధ సామగ్రి ఉత్పత్తి కట్టుదిట్టముగ లేదు.

### (ఆ) ముందు స్థితి :—

1. అక్టోబరువరకు ఇంగ్లాండు నిలువరించుకో కల్గినచో హిట్లరు గెలిచే అవకాశం సున్న.

2. బ్రిటిషు ప్రజలు యిదివరకువలెనే చాల ఐకమత్యంతో తప్పక గెలవాలను స్థిరసంకల్పం కల్గియున్నారు.

3. రాయలు విమానదళంవారి అద్భుత చర్యలు దేశమంతకు ఉత్సాహం కలిగించినవి.

4. సామ్రాజ్యమంతట సైన్యాలు అతివడిగ సమకూర్చబడుచుండెను.

5. సముద్రాధిపత్యం యింకా బ్రిటిషువారికేగలదు.

## 1941

### (అ) ఇపుడు యితరదేశాల సహాయం.

1. మిత్రమండలికి లాభాలు.—స్వతంత్ర ఫ్రాంసు, హాలండు, బెల్జియం, నార్వే, జకోస్లావేకియా, పోలండు, గ్రీసు, యుగోస్లావియా, రషియా, చీనాలు—అన్ని దేశాలు స్వాతంత్ర్య సమరమునందు ఐకమత్యం కలిగియున్నవి. ఇంగ్లీషు ఛానలు రేవులను జర్మనీ ఆక్రమించుటవలన అట్లాంటికు సముద్రయుద్ధం ప్రారంభమయి, యిపుడచట జర్మనీ ఓడుచున్నది.

2. బ్రిటను నిలువరించుకొని యుండెను. ఇంకా ప్రమాదం తొలగలేదు. కాని ఆయుధబలం సైన్య బలం పూర్తిగ చేకూరింది. 1940 వ సంవత్సరములో చేరువైన ప్రమాదం 1941 వ సంవత్సరంలో అట్లే యుండెనుకాని, ఇతర యుద్ధరంగాలకు ఇంగ్లాండు సైన్యాలను పంపగల్గుచున్నది.

3. యూరోపు దిగ్బంధం యింకా బిగువయినది. జర్మనీకి దినదినం ఒత్తిడి ఎక్కువవుతున్నది. ఇంగ్లాండికి అక్షరాజ్యాలు దిగ్బంధం చేయజాలకపోయినవి. కాని కొద్ది సామాను నౌకలను ముంచ గల్గినవి. బ్రిటిషువారి యుద్ధం చేయు సమర్థత నానాటికి హెచ్చుచున్నది.

4. దాడి జరుగనేలేదు. రాయలు విమానాల కాకలాకు భయపడి శత్రువు ఆ ప్రయత్నమే పూర్తిచేయలేకపోయెను.

5. శక్తి సామర్థ్యాలు అట్లేయున్నవి. కాని ఉభయుల విమానాల సంఖ్యల వ్యత్యాసం తగ్గుచున్నది. ఇంగ్లాండుపై జర్మను విమానాల దాడికన్న జర్మనీపై బ్రిటిషు విమానాల దాడి తీవ్రతరమై వినాశకరమగు బాంబులు అధికంగాపడి జర్మనీకి నష్టం అధికమయింది. బ్రిటిషు విమానాలే యిపుడు ముందంజ వేస్తున్నవి.

6. యుద్ధంలో ప్రత్యక్షంగా దిగిపోవడం తప్ప తక్కిన సహాయం అంతా చేయడానికి అమెరికా ఒప్పుకుంది. బ్రిటను తప్పక జయించునని రూజువెల్టుగారు, తదితర అమెరికను నాయకులు ప్రకటించిరి. 50 డిస్ట్రాయరు విమానాలు అమెరికా పంపింది. అధ్యక్షుడుగ రూజువెల్టే తిరిగి ఎన్నుకొనబడెను. అట్లాంటికు సముద్రం కాపలాకాయుట కంగీకరించి, ఐసులాండుకు అమెరికా సేన పంపబడెను. ఇదంతా అమెరికా ఇంగ్లండుకుచేసిన సహాయమే. అమెరికాకూడ యుద్ధంలో దిగుతుందని జర్మనీకి మహాభయంగా ఉంది. యుద్ధసామగ్రి తయారు మంచి కట్టుదిట్టములతో జరుగుచున్నది.

### (ఆ) జరిగినది :—

1. హిట్లరు గెలిచే అవకాశం పోయింది. ఇపుడాతడు కడుదీర్ఘకాలం యుద్ధం సాగించాలి.

2. బ్రిటిషు ప్రజలును సామ్రాజ్య ప్రజలును నాజీ అధికారం అణచివేసి ప్రపంచంలో స్వాతంత్ర్యం నెలకొల్పాలను స్థిరసంకల్పం కల్గియున్నారు. లండను యీ ఉద్యమానికి కేంద్రంగాయుంది.

3. ఈ చర్యలు ఆంగ్లేయులకేగాక, ప్రపంచంలో స్వతంత్ర దేశాలన్నింటికి ఉత్సాహం కలిగించినవి. అన్ని యుద్ధరంగాలలో బ్రిటిషు విమానాలు పోయి యుద్ధంచేసి అసమాన ఖ్యాతిని బడయుచున్నవి.

4. ఇంకను సైన్యసమీకరణ జరుగుచున్నది. 1942 వ సంవత్సరములో పూర్తియగును.

5. అట్లాంటిక్ సముద్రంలో మాత్రం బ్రిటిషువారి నౌకాధిక్యతకు అడ్డు కన్పించింది. శత్రువెంత కృషిచేసిన యీ ఆధిక్యత తగ్గించలేకుండెనని రుజువైనది.

## 1940

6. ఈజిప్టుకి శత్రు భయం. ఆఫ్రికాలో అనేకచోట్ల దాడి చేయుటకు ఇటలీ ప్రయత్నించుచుండెను. బ్రిటిషు సోమలీలాండు గోల్పోయినా తాత్కాలిక నష్టంగా ఎంచబడెను.

### మొత్తంపై స్థితి.

ఫ్రాంసు, హాలండు, నెదరులండ్సునందు జర్మనీ విజయం చూస్తే ఇంగ్లాండుకి భీతిగానే యుండెను. కాని దేశము లంతా ధైర్యంగానుండి, శత్రువు నెదుర్కొనగలమనే తలంచి యుండిరి. బ్రిటిషు నౌకాశక్తి అక్షరాజ్యాల ప్లానులను అపుడే తారుమారు చేయుచుండెను.

## 1941

6. ఆఫ్రికాలో బ్రిటిషువారే దాడి ప్రారంభించి ఇటలీ సైన్యాలకు దిగ్భ్రమ గొల్పిరి. ఇటలీ సేనకు బ్రిటిషుసేనకు 3 : 1 వ్యత్యాసమున్నా, బ్రిటిషు సేనలు ఇరిత్రియా, అబిసీనియాల నాక్రమించి, తమ సోమలీలాండును తిరిగి తీసుకున్నవి. సిరియాను ఆక్రమించి, ఇరాకులో తిరుగుబాటును అణచివేయుటవలన ఇండియాకు, మధ్యప్రాచ్యదేశములకు శత్రువుల ముప్పు తప్పిపోయింది. ఇపుడు తనమిత్ర దేశమగు టర్కీ సరిహద్దులకు బ్రిటిషు రాజ్య సరిహద్దులకు చేరువయ్యెను. బాల్టికు రాజ్యాలను, క్రీటు దీవిని శత్రువు ఆక్రమించినా మధ్యధరాసముద్రమంతా బ్రిటిషు నౌకాదళాధికారంక్రిందనే యున్నది.

### మొత్తంపై స్థితి.

రష్యాయుద్ధం యింకా సమాప్తి కాలేదు. ముఖ్య ఘట్టం యింకా ముందరేయుంది. జర్మనీ సైన్యాలు బాగా దెబ్బతింటున్నా, యింకా గడితప్పలేదు. ఈ సైన్యంగూవ్ మాస్తేగాని యూరోపులో శాంతియుండదు. బ్రిటిషు నౌకాశక్తిచే హిట్లరు యూరోపులోనే బంధించబడును. బ్రిటిషు విమానాలు జర్మను నగరాలను, పరిశ్రమలను, మంటగల్పుచున్నవి. ఇంగ్లాండు ఆత్మసంతుష్టితో ఉదాసీనంగా ఊరుకోలేదు. సైనికశక్తి, ఆయుధశక్తి, పూర్తిగాగలిగి, మిత్రమండలిదేశాల సహాయంతో భీతి తొలగియున్నది. గెలుస్తామన్న ధైర్యం కల్గియుండుటకు హేతువుగలదు.

---

# రూజువెల్టు—చర్చిలు సమావేశము.

### యుద్ధంసాగించుటకు, శాంతి నెలకొల్పుటకు ఎనిమిది ముఖ్య సూత్రాలు.

### బ్రిటను అమెరికాల ఆదర్శములు ప్రకటించిరి.

అమెరికా ప్రభుత్వాధ్యక్షుడగు రూజువెల్టుగారు యీయేడు ఫిబ్రవరి మాసంలో బ్రిటిషు ప్రధానమంత్రియగు చర్చిలుగారిని చూడదలచిరి. కాని అపుడు గ్రీసు క్రీటు దేశాలలో ఘోర యుద్ధం సాగుచున్నందున వీలుకాకుండెను. యుద్ధానికి సంబంధించిన సమస్య లన్నింటిగురించిన్ని, తరువాత శాంతి నెలకొల్పినపుడు తిరిగి ద్వేషాలు పెరక్కుండా చేయాల్సిన యేర్పాటుల గూర్చిన్ని, ఇపుడు ఇంగ్లాండుకి ఎటువంటి సహాయం చేయాలో జర్మనీ ఆక్రమించిన దేశాల దౌర్భాగ్యస్థితి యెట్లున్నదో యీ విషయాలన్నీ చర్చిలుగారితో రూజువెల్టుగారు స్వయంగా చర్చింపదలచిరి. గత వారం వీరుభయులు, ప్రపంచంలో యితరులెవ్వరికి తెలియకుండా ఎక్కడో ఒకచోట రహస్యంగా కలుసుకొని చర్చించేరు. వారేమి మాట్లాడేరో ఆ వివరాలన్ని యింపతరకు ప్రకటింపబడలేదు. కాని యుద్ధం సాగించడం, తరువాత శాంతి స్థాపించడం గూర్చి అమెరికా-యింగ్లాండుల ఉద్దేశాలను తెల్పుచు వారుభయులు చరిత్రాత్మకమగు ఒక ప్రకటన చేసేరు. అందు యిట్లున్నది:—

అమెరికా అధ్యక్షుడును, బ్రిటిష్ ప్రధానియు తమ ప్రభుత్వముల తరఫున ఒకచో సమావేశమయి, యికముందు యుద్ధానంతరం ప్రపంచంయొక్క భవిష్యత్ క్షేమానికిగాను ఈ క్రింది సూత్రములను ఆచరణలో పెట్టుట అవసరమని నిశ్చయించిరి:—

(1) ఇతర దేశముల ప్రదేశమును ఆక్రమించుటగాని, వాటిపై అధికారం చలాయించుటగాని బ్రిటను-అమెరికాల ఉద్దేశంకాదు.

(2) ఏ దేశంయొక్క భూభాగమునూ ఆ దేశంయొక్క ప్రజల సమ్మతిలేకుండ మరోదేశం తీసుకోరాదు.

(3) ప్రతిదేశం ప్రజలును తామెట్టి ప్రభుత్వ విధానంచే పరిపాలింపబడవలెనో నిర్ణయించుకొను హక్కు వారే కలిగియుందురు. ఆ హక్కును అమెరికా-యింగ్లాండులు గుర్తించుచు, అట్టి స్వపరిపాలనా హక్కు తొలగింపబడిన ప్రజల కవి తిరిగి ఒసంగబడునట్లు చేయగోరెదరు.

(4) పెద్ద దేశములకును చిన్న దేశములకును, విజయంపొందిన దేశములకును ఓడిన దేశములకును, తమ ఆర్థికాభివృద్ధికి అవసరమగు ముడిపదార్థములను ప్రపంచంలో ఎక్కడున్నా తెచ్చుకొనుటకు, స్వేచ్ఛా వ్యాపారం చేయుటకు సరి సమానమగు అవకాశము లుండవలెను. బ్రిటను-అమెరికాలు తామిపుడు నిర్వర్తింపవలసిన బాధ్యతలకు లోబడి ఈ అవకాశములు కలిగించుటకు గట్టి ప్రయత్నమును చేయును.

(5) కార్మికుల అభివృద్ధికి, ఆర్థికాభివృద్ధికి, సంఘక్షేమమునకు ఎట్టి కార్యక్రమము అవసరమో అది వివిధ దేశములు కలసి నిర్ణయించునట్లు యేర్పాటు చేయబడును.

(6) నాజీ దౌష్ట్యము అంతమొందిన పిదప ప్రతిదేశంవారును తమ సరిహద్దులలో నిర్భయంగా కాలం గడుపుటకును ప్రతి దేశంలో ప్రతివాడును దారిద్ర్యము, భయము లేకుండా బ్రతుకుటకు వీలుండునట్టి శాంతి నెలకొల్పదలంచిరి.

(7) అట్టి శాంతివలన అన్ని దేశములవారు సముద్రములమీద రాకపోకలు జరుపుటకు సరిసమానమగు హక్కుండవలెను.

(8) ప్రపంచ క్షేమముకొరకు నైతిక సూత్రముల ననుసరించి అన్ని దేశములును దౌర్జన్య ప్రయోగమును మానుకొనవలెనని అమెరికా, బ్రిటనులు నమ్ముచున్నవి. తమ సరిహద్దులనుదాటి యితర దేశములను ఆక్రమించు ఉద్దేశంతో ఆయుధములను ప్రయోగించుటకు జంకని దేశాలు కొన్ని గలవు. వాటివలన ప్రపంచ శాంతికి భంగం కలుగకుండుటకై, ప్రపంచ శాంతి రక్షణకై శాశ్వతమగు యేర్పాటు చేయబడువరకును, అటువంటి పరదేశాక్రమణగల దేశములను నిరాయుధ మొనరించుట అవసరము. శాంతిని కాంక్షించే దేశాలకు యిటువంటి దేశములవల్ల కలుగు ఒత్తిడిని తగ్గించుటకు అనుసరింపదగ్గ యితర చర్యలుగూడ అమలుజరుపబడును.

అంగడి అమ్మే బ్రిటిషు బాలికలు చిచ్చు బాంబులను ఆర్పుట.



జర్మను విమానదళములనుండి పడిన ఇన్సెండియరీ బాంబులను చల్లార్చుటకు వెంబ్లి, లండన్ స్టోరులోని బాలికలుచేరి ఒక ఫైరు బ్రిగేడును ఏర్పాటుచేసినారు. అభ్యాసముకొరకు బాలికలు, స్టోరుయొక్క పైకప్పు మీదికి ఎక్కుటను ఇచ్చట చూడవచ్చును.

## ఇండియాకుకూడా వర్తించును.

బ్రిటిషు డిప్యూటి ప్రధానియు లార్డు ప్రివీసీలును అగు అట్లీగారు, యీ ప్రకటనను ఆగష్టు 14 వ తేదిన గురువారంనాడు రేడియోద్వారా ప్రపంచం అంతటికీ తెలిపేరు. దీని అంతరార్థమును మరునాడొక సభలో వారు విపులంగా యిట్లు చెప్పిరి:—"మనం కోరే స్వాతంత్ర్యం అందరు ప్రజలకు అందజేయాలని మా కార్మికపక్షంవారు కోరుచున్నారు. గురువారంనాటి ప్రకటన అన్ని జాతులవారికి ఆసియా వాసులకు, ఆఫ్రికా వాసులకుగూడ వర్తిస్తుంది". ఇంగ్లాండు యే స్వాతంత్ర్య, సంఘక్షేమములకొరకు యిపుడు యుద్ధం చేస్తున్నదో ఆ స్వేచ్ఛాభద్రతలు మానవకోటి అందరికి నల్లవారికి తెల్లవారికిగూడ వర్తింప జేయాలని వారి యుద్దేశము. వారింకా యిట్లు చెప్పేరు:—

"తెల్ల జాతులవారు నల్ల జాతులవారికి చేస్తున్న అన్యాయాలను మా కార్మిక పక్షంవారు సర్వదా గుర్తిస్తున్నారు. ఎక్కువ జాతులవారి సౌఖ్యం సంపదా పెంపొందించుటకు పాటుపడే తక్కువ జాతులవారుండే నివాసస్థానములే వలస రాజ్యములనే ప్రాత అభిప్రాయం కాలం గడచినకొలది మరుగునబడి, అంతకన్న ఉన్నతభావాలు యేర్పడుచున్నందుకు సంతసించుచున్నాము. నిన్న నేను ప్రకటించిన ముఖ్య సూత్రములు ప్రపంచంలో అన్ని జాతులవారికే వర్తించునని నేను నమ్ముచున్నాను."

ఈ సమిష్టి ప్రకటనను స్వాతంత్ర్యా అభిలషించే దేశాలన్నియు హర్షించినవి—ఇంగ్లాండు, అమెరికా, అధినివేశ రాజ్యములు, వలస రాజ్యములు, ఇండియా యిపుడు జర్మనీ కాలు క్రింద నలుగుచున్న దేశాలు గూడ అంగీకరించినవి. బ్రిటిషువారి శాంతి విధానం అమెరికా ప్రజలకిపుడు మరింత స్పష్టంగా తెలిసింది. కనుక, వారును ఉత్సాహం చెందిరి.

## జర్మనీ విముఖత్వం.

ఈ ప్రకటనవలన నాజీ దౌష్ట్యం క్రింద నలిగిపోవుచున్న పీడిత దేశాలకు ఉత్సాహం కలిగి, జర్మను కుపాలనపై తిరుగబడెదరు. కావున జర్మనీకి యీ ప్రకటన యిష్టంలేదు. జర్మను రేడియోలో దీనిని తూలనాడుట అపుడే ప్రారంభమయింది. ఇది చాల పురాతనమయిందని, తుప్పు పట్టిన పెట్టెలోనుండి తీయబడిన చింకివస్త్రం లాంటిది ప్రకటనయని, దీనిలో చెప్పిన ధర్మపన్నాలు అమెరికా ఇంగ్లాండులే అనుసరించలేవని జర్మను లంటున్నారు. అన్ని దేశాలకు స్వేచ్ఛా వర్తక సౌకర్యముండాలని, నౌకా మార్గాలకు నిరోధాలుండరాదని నీతులు చెప్పుతూ, అమెరికా ఇంగ్లాండులు జర్మనీకి దిగ్బంధం ఎందుకు చేస్తున్నారని, వ్యాపార బాహ్యమగు కంపెనీల జాబితా ఎందుకు ప్రకటిస్తున్నారని జర్మనీ అడుగుచున్నది. రూజువెల్టు కొన్ని రేవుల నాశించి యిట్లు చేస్తున్నాడని నిందకూడా వేసింది. జర్మనీ ప్రభుత్వం ప్రపంచమంతా అధికారం చలాయించాలని యత్నించుటచేతను, వెనుక పెద్ద సైనికబలం పెట్టుకొని కొన్ని యుక్తులచే యూరోపు, ఆశియా, అమెరికాలు మూడింటిని వశపరుచుకోవాలని ప్రయత్నించుట చేతనే, యీ బహిష్కారం, వర్తకనిషేధం అమలుజరుపబడినదని జర్మనీ మరచిందికాబోలు.

ఆఫ్రికా వాయువ్యదిక్కున అట్లాంటికు సముద్రతీరాన ఉన్న ముఖ్యమగు డాకరు రేవు రక్షణబాధ్యత తనకిమ్మని ఫ్రాంసు ప్రభుత్వానికి జర్మనీ ఒత్తిడి కలుగజేస్తున్నది. వేసంగికాలం ముగిసేలోపల రష్యాలో ఉక్రెయిను, నల్ల సముద్రం, డార్డనల్సు జలసంధి, ఫ్రెంచివారి డాకరు రేవు తన వశమయిపోతే హిట్లరు యూరోపులో సంయుక్తరాష్ట్రముల ప్రభుత్వం యేర్పాటు చేయదలచెను.

నాజీ పరిపాలన క్రింద నుండే యూరోపు ఎట్లుండునో తెలియదా? స్వేచ్ఛగ మాట్లాడుకొనుటకు వీలుండదు. పత్రికలు యిష్టంవచ్చినట్లు వ్రాయ వీలుండదు. ప్రజలు సర్వదా భయంతో మెలగాలి. గడిదాటితే జెయిలులో త్రొక్కుతారు. దేశంలో సంపదంతా పాలకులు దోచుకుంటారు. ఆఫ్రికా, యూరోపు ఖండములంతటి వర్తకం, పరిశ్రమలు, ఫ్యాక్టరులు నాజీల చేతులలో ఉంటాయి. క్రొత్త విధానం ప్రకారం లాభాలన్ని వారికే. వారే అధికారులు.

యూరోపులో వారు తలపెట్టిన నూతన విధానంలో నూతనత్వం యేమి ఉండదు. అదివరకు చేయుచున్న ప్రజాపీడన నిరంకుశత్వమే యిక్కడ క్రొత్తగ స్థాపించబడును.

కావున, రూజువెల్టు-చర్చిలుగార్లు తమవిధానమును తెల్పుచు గావించిన ప్రకటన చాలముఖ్యమయినది. హిట్లరు నూతన విధానంపై యిది సవాలు. జర్మనీ ఆక్రమించిన దేశాల బానిసత్వ విముక్తి స్వాతంత్ర్య ప్రదానము వాగ్దానం చేయబడెను; ఆయుధ విసర్జనమును, యికముందు యిట్టి ప్రమాదాలు లేకుండా వారించుటకును వాగ్దానం చేయబడెను.

# ఈ వారంలో యుద్ధ వార్తలు.

## విమానదాడులు.

14 వ తేది పగలు వందల కొలది బ్రిటిషు విమానములు ఫ్రెంచి తీరముపైకి దాడి వెడలి బులోను మొదలగు రేవుల పైన వేలకొలది బాంబుల వర్షించెను. జర్మన్ విమానములు వచ్చి యెదుర్చగా వానిలో 14 పడగొట్టబడెను. 5 బ్రిటిషు విమానములు తిరిగిరాలేదు. ఆరాత్రి 300 బ్రిటిషు విమానములు జర్మనీయందలి, హనోవరు, బ్రన్స్‌విక్, మెగ్డెబర్గు అను పారిశ్రామిక పట్టణములపై చాలసేపు బాంబుల వర్షించెను. బర్లినుపైనగూడ చాల బాంబులుపడినవి. 16 వ తేది పగలు, చాల బ్రిటిషు విమానదళములు ఇంగ్లీషు సముద్రముపైన, ఫ్రెంచి తీరపు రేవులపైనను విహరించి, శత్రునౌకలను రేవు పట్టణములను బాంబుల వర్షముతో ముంచియెత్తెను. సెయింటు ఓమరు విమానాశ్రయము ధ్వంస మొనర్పబడెను. 18 శత్రు విమానములు శిథిలమొనర్పబడెను. 4 బ్రిటిషు విమానములు తిరిగిరాలేదు. రాత్రి కలోను, డస్సెల్డార్ఫ మొదలగు, జర్మనీలో రూరు రైను ప్రాంతములందలి పారిశ్రామిక పట్టణములపై బ్రహ్మాండమగు దాడుల సాగించెను 13 బ్రిటిషు విమానములు తిరిగిరాలేదు. రాటర్డాం రేవుపైన, మరీ తీవ్రమగు దాడి జరిగెను. 17 వ తేది రాత్రి వాతావరణం అనుకూలముగ లేకపోయినను 100 బ్రిటిషు విమానములు, జర్మనీలోని పడమటి ప్రాంతమునందలి బ్రెమెన్ సూయిస్‌బర్గు మొదలగు ప్రదేశములపై బాంబులను గుర్పించెను. జర్మను విమానములు ధ్వంసమొనర్పబడెను. 2 బ్రిటిషు విమానములు తిరిగిరాలేదు. 18 వ తేదిన పగలు మరల ఫ్రెంచి తీరపు రేవులను, లిల్లీ మొదలగు దుర్గములను ఎదిర్చి అచటి నౌకలమీదను, రైలుస్టేషనులు మొదలగు వానిపైనను అగ్నివర్షమును గురిపించిరి.

19 వ తేది మంగళవారం రాత్రి బ్రిటిషు విమానములు జర్మనీ పశ్చిమ ప్రాంతములపై విస్తారమగు దాడుల జరిపెను. జర్మను నౌకా నిర్మాణశాలలుగల కీలు రేవు పైన వేలకొలది పెద్ద పెద్ద బాంబులు వర్షింపబడెను. హాలండులోని విమానాశ్రయములపై గూడ చాల బాంబులు వేయబడెను. ఈ దాడులనుండి రెండు విమానములు తిరిగిరాలేదు.

20 వ తేదిన తూర్పునుండి బ్రిటిషు విమానములు పడమటి నుండి రష్యను విమానములువచ్చి బర్లిను నగరముపై బాంబులు వర్షించెనని జర్మనులు అంగీకరించిరి.

13 వ తేది బుధవారం రాత్రి బ్రిటనుపై యెక్కడనూ శత్రు విమానదాడి అసలులేనే లేవు. 14 వ తేది రాత్రి అతి స్వల్పమైన దాడులు అక్కడక్కడ జరిగినవి. బ్రిటిషు ఈశాన్య భాగంలోను, తూర్పు జిల్లాలలోను మిడ్లండ్సు ఉత్తర ప్రాంతములోను బాంబులు పడినవి. స్వల్పంగా ప్రాణనష్టం, ఆస్తి నష్టం సంభవించినది. 15 వ తేదిన పగలు ఒక్క విమానం మాత్రము తూర్పు ఆంగ్లియా జిల్లా పైకి వచ్చి అక్కడక్కడ బాంబులు వేసిపోయెను. దానివలన ఆస్తికిగాని, ప్రాణాలకుగాని యేవిధమగు నష్టమును కలుగలేదు. 16 వ తేది రాత్రి ఇంగ్లండు ఆగ్నేయ తీరపు పట్టణములమీద, మిడ్లండ్సు జిల్లాలోను చాలచోట్ల బాంబులు పడెను. ఒక పట్టణంలో కొంత ప్రాణనష్టం గలిగింది. ఆస్తికి విశేష నష్టంకలుగలేదు. ఒక శత్రువిమానం పడగొట్టబడినది. 17 వ తేది రాత్రి కొన్ని విమానాలు బ్రిటనుపైకి వచ్చి ముఖ్యమగు పారిశ్రామిక పట్టణములలోనొకటియగు హల్లు నగరముమీద చాల బాంబులు వేసెను. కొంత నష్టము గలిగినది. ఇంకను చాల ప్రదేశములలోగూడ బాంబులు పడెను గాని యెక్కువ నష్టం కలుగలేదు.

మంగళవారం రాత్రి బ్రిటను ఆగ్నేయ భాగంలో స్వల్పముగ బాంబులు పడెను కాని నష్టమేమియు గలుగలేదు.

20 వ తేదిన ఒక జర్మను విమానము, ఐస్లాండు పైకివచ్చి చాలసేపు విహరించి పోయెను. కాని బాంబుల వేయలేదు.

జూలై నెల అంతలోను కలసి మొత్తం 300 జర్మను విమానాలైనా బ్రిటనుపైకి దాడిరాలేదు. ఈసంఖ్య, ఒక్క రోజున జర్మనీ, ఫ్రాన్సులపై దాడుల జరుపుచున్న బ్రిటిషు విమానాల సంఖ్య యంతైనాలేదు.

## ఇటలీ—ఆఫ్రికా—మధ్యధరా.

బ్రిటిషు విమానములు 13 వ తేది బుధవారం రాత్రి, ఉత్తరాఫ్రికాలోని బడియా, డెర్నా, బెంఘాజీ మొదలగు రేవులపైనను, ఆయుధ సామగ్రిని తీసుకొని పోవుచుండు మోటారు లారీలపైనను చాలదీర్ఘమగు దాడులు సాగించెను. ఒక రైల్వే స్టేషను ధ్వంసమొనర్పబడెను. టూబ్రూకు నందలి బ్రిటిషు సైన్యములా రాత్రి ఆకస్మికముగ, ముట్టడించియున్న జర్మను సైన్యములపై బడి, ఒక కాపలా దళమును పూర్తిగ నిర్మూలించెను. పిమ్మట లోనికి చొచ్చుకొనిపోయి, తీవ్రముగ నెదిర్చి కొందరిని ఖైదీలుగ పట్టితెచ్చిరి. 15 వ తేది రాత్రి, ఇటాలియనుల సిసిలీ ద్వీపమునందలి కాటనియా నగరముపై బ్రిటిషు విమానములు తీవ్రమగు దాడి జరిపెను. చాల నష్టము గలిగినదని ఇటాలియనులుకూడ అంగీకరించిరి. 17 వ తేది రాత్రి టూబ్రూకు వద్ద ఉభయ పక్షములకు తీవ్రమైన పోరాటమే జరుపబడెను. ఆరాత్రి బ్రిటిషు విమానములు, సైరాక్యూస్ రేవుపై భయంకరమగు దాడినిసాగించినవి. బ్రిటిష్ బాంబులవలన నగరమంతయు ఇంచుమించు పూర్తిగ ధ్వంసమైపోయెను. రేవునందలి నౌకలకుకూడ చాల నష్టము కలిగెను.

14 వ తేది శత్రువులు సూయజు కాలువ ప్రాంతముపైనను సైప్రెస్ దీవిపైనను విమాన దాడి సల్పిరి. సూయజువద్ద 7 గురు మరణించిరి. 9 మందికి గాయములు తగిలెను. సైప్రెస్ దీవిపైనగూడ ఆ రోజున రెండు దాడులు జరిగెను. 18 మందికి గాయములు తగిలెను, 4 మరణించిరి. మరునాడుగూడ శత్రువులు యిదే విధంగా రెండు దాడులు సాగించిరి.

15 వ తేది రాత్రి బ్రిటిషు విమానములు, మధ్యధరా సముద్రమున ప్రయాణమొనర్చుచున్న శత్రు నౌకల జట్టునొకదాని నెదిర్చెను. అందు 5 సరకుల స్టీమర్లు వానికి రక్షణగ మరికొన్ని డిస్ట్రాయరులు వుండెను. వానిలో 6,000 టన్నుల నౌక యొకటి, 3,000 టన్నుల నౌక మరియొక్కటి ఒక డిస్ట్రాయరు ముంచివేయబడెను. ఆ రోజుననే, డచ్చి జలాంతర్గామి యొకటి 5,000 టన్నుల సప్లై నౌకను, 1,000 టన్నుల నౌక ముంచివేసెను.

15 వ తేదిన దక్షిణాఫ్రికా రేవునుండి చాల నౌకలు సైనికుల నెక్కించుకొని మధ్య ప్రాచ్యమునకు ప్రయాణమై వెళ్లెను. ఆఫ్రికా ప్రధానియగు స్మట్సుగారుగూడ యీజిప్టునకు విమానములో ప్రయాణమై వెళ్లిరి.

## నౌకా నష్టములు.

బ్రేజిలునుండి సరకుల దెచ్చుకొనుచున్న నార్దెనీ (3,667 టన్నులు) అను జర్మను నౌకను, స్టెల్లా అను ఇటాలియను

నౌకను బ్రిటిషు నౌకలు 15 వ తేదిన అట్లాంటికు సముద్రమున పట్టుకొని స్వాధీనపరచుకొనెను.

17 వ తేదిన సముద్రములలో మందుగనులను తుడిచి వేయు పనుల కుపయోగించు బ్రిటిషు నౌక యొకటి ముంచి వేయబడెను.

“హారక్ షెల్లు” అను బ్రిటిషు నూనె నౌక (8,000 టన్నులు) ఆగస్టు 6 వ తేది ప్రాంతమున శత్రువులచే ముంచి వేయబడెను. అందుపని చేయువారిలో 12 మంది సురక్షితముగ బ్రిటను చేరిరి.

సంగ్రామారంభమునుండి, 1941 వ సం॥ ఆగష్టు 18 వ తేదివరకు జర్మనీ తాలూకు 2,321,000 టన్నుల నౌకలు, ఇటలీ తాలూకు 1,533,000 టన్నుల నౌకలు, ఫిన్లండు తాలూకు 34,000 టన్నుల నౌకలు, ఇతరులవి 119,000 టన్నుల నౌకలు—పట్టుబడుటవలన నేమి ముంచివేయబడుటవలన నేమి—నష్టమైనవి అని బ్రిటిషు అధికారులు ప్రకటించిరి.

## తటస్థ దేశములు.

అర్జెంటైనా (దక్షిణ అమెరికా) ప్రభుత్వము, సంగ్రామము నందున్న దేశముల తాలూకు తమ రేవులందున్న 20 నౌకలను స్వాధీనపరచుకొని ఉపయోగించుకొనుటకు నిశ్చయించెను. వీని పరిమాణము 2 లక్షల టన్నులుండును. క్యూబా దీవియందలి ఆక్సిసు (కాన్సలేటులు) ప్రతినిధుల కార్యాలయములను మూసివేసి వెడలిపోవలసినదని క్యూబా ప్రభుత్వము వారుత్తరువుగావించిరి.

జర్మనులు అర్జెంటైనా నుండి తమ రాయబారిని ఉపసంహరించుకొని రాజకీయ సంబంధముల తెగగొట్టుకొనిరి.

వేలకొలది జర్మను సైన్యములు స్పెయినుగుండా వెళ్లుచున్నవను వదంతులు అసత్యమని స్పెయిను అధికారులు ప్రకటించిరి.

పోర్చుగలు కాలనీలలో యొకటియగు మొజాంబిక్ దీవియందలి పోర్చుగలు ప్రభుత్వాధికారులు, స్మట్సు సేనాని (దక్షిణాఫ్రికా ప్రధాని) వద్దకు రాయబారము వెడలి బ్రిటిషు వారు కోరినంతనే పోర్చుగలుతో సంబంధము త్రెంచుకొని మిత్రమండలికనుకూలమగు స్వతంత్ర ప్రభుత్వమును ప్రకటించెదమని వాగ్దానమొనర్చినటుల స్పెయిను పత్రికలు ప్రకటించెను. పోర్చుగలు రాయబారి స్పెయిను విదేశాంగ మంత్రిని కలసుకొని అట్టి వదంతులు పూర్తిగ నిరాధారమైనవని తెలియజరచెను.

## అమెరికా-అట్లాంటిక్.

అమెరికా సంయుక్తరాష్ట్ర ప్రభుత్వపు అధ్యక్షుడగు రూజ్వెల్టును, బ్రిటిషు ప్రధానమంత్రియగు చర్చిలును, అట్లాంటికు సముద్రమున నొకచోట తమతమ యుద్ధ నౌకలపై సమావేశమై యుద్ధ నిర్వహణ విషయములను, అంతర్జాతీయ సంబంధములను చర్చించుకొని ఉభయ దేశములును అనుసరింపదగిన కార్యక్రమమును నిర్ణయించుకొనిరి. పై చర్యలయందు బ్రిటిషు-సంయుక్త రాష్ట్ర సైనిక శాఖల ప్రధానాధికారు లందరును పాల్గొనిరి. సంగ్రామమును సాధించుటలో తమ ఆశయములను, విజయానంతరము తాము ప్రపంచమున నెలకొల్పదలచిన శాంతిని సూచించుచు వీరు 8 సిద్ధాంతముల నిర్ణయించిరి. ఉభయదేశముల తరఫునను, బ్రిటిషు ప్రభుత్వ ఉప ప్రధానియగు మేజరు అట్లీగారు వానిని 14 వ తేదీన ప్రకటించెను. చర్చిలు, రూజ్వెల్టు కలసి సోవియటు రష్యా ప్రధానియగు స్టాలినుకొక సందేశమంపిరి. బ్రిటను, సంయుక్తరాష్ట్రములనుండి కొందరు ప్రధాన సైనికోద్యోగులను పంపెదమనియు, అన్ని యుద్ధరంగములలోని ఆవశ్యకతలను, రష్యను సైనికాధికారులు వారితో చర్చించి తమకు కావలసిన ఆయుధ సామగ్రులను నిర్ణయింపవలెననియు, బ్రిటను, సంయుక్తరాష్ట్రములు వానిని సరఫరా చేయుననియు, ఆ సందేశమున దెలిపిరి. ఆ సూచనలను స్టాలిను అంగీకరించెను. సంయుక్త రాష్ట్రములలో నిర్బంధ సైనిక సేవను ఒక వత్సర కాలమునుండి 2½ సంవత్సరములకు హెచ్చించు చట్టము శాసనసభలో ఆమోదింపబడెను. రూజ్వెల్టు అధ్యక్షుడు దానికి అనుమతి నొసగి అమలులోకి తెచ్చెను. ఇదివరకు కంటె ఇపుడు సంయుక్త రాష్ట్ర ప్రభుత్వము యుద్ధమున దిగు పరిస్థితు లేర్పడలేదనియు రష్యనులు చాలకాలము జర్మను దాడుల నిరోధించి యుండగలరనియు రూజ్వెల్టు అధ్యక్షుడు 16 వ తేదీన ప్రకటించెను. బ్రిటిషు ప్రభుత్వ మంత్రియగు బీవరుబ్రూకుగారు ఆయుధ సప్లైల విషయమున సంయుక్త రాష్ట్రములకు వచ్చెను. ఇతడు న్యూయార్కులో మాటలాడుచు తమకు సంయుక్త రాష్ట్రములనుండి సైనిక సహాయ మక్కరలేదనియు, ఆయుధముల నంపిన చాలనియు ప్రకటించెను. సంయుక్త రాష్ట్ర యుద్ధ నౌకలు అట్లాంటికు సముద్రమున గస్తీ తిరుగుచున్నవనియు, ఒక్క జర్మను నౌకయైన సముద్రముమీద గన్పింపలేదనియు సంయుక్త రాష్ట్ర నౌకా కార్యదర్శి కర్నలు నాక్సుగారు 16 వ తేదీన ప్రకటించెను.

ఇపుడున్న యేర్పాటుల ప్రకారము, రెండువత్సరముల వరకు రోజుకు రెండు నౌకలు చొప్పున సంయుక్తరాష్ట్రములందు తయారు చేయబడుచుండునని అడ్మిరల్ లాండుగారు (సంయుక్తరాష్ట్ర శాసన సభల నౌకస్థాయి సంఘాధ్యక్షుడు) 17 వ తేదిన ప్రకటించెను. 18 వ తేదిన రూజ్వెల్టు చర్చిలుతో తన సంభాషణ వివరములను రహస్యముగ శాసన సభల నాయకులకు తెలియజేసెను.

రష్యాకు వ్లాడివాస్టకు రేవును చేరునటుల యిదివరకు చాల నౌకలను ఆయుధ సామగ్రితో పంపితిమనియు, యింకను పంపనుంటిమనియు సంయుక్తరాష్ట్ర అధికారులు ప్రకటించిరి.

మధ్యప్రాచ్యము (ఈజిప్టు-ఈరాక్-సిరియా) న బ్రిటిషు వారు సాగింపనున్న యుద్ధమునకుగాను చాల విమానములను సత్వరముగ అందుటకుగాను ఆఫ్రికామీదుగ పంపబడునని రూజ్వెల్టు అధ్యక్షుడు ప్రకటించెను.

1943 వ సంవత్సరము వరకు గూడ మహా సంగ్రామము సాగుననియు, అప్పటివరకును కావలసిన ఆయుధోత్పత్తి యేర్పాటులు గావింపబడుచున్నవనియు 19 వ తేదిన రూజ్వెల్టు వెల్లడించెను.

## రష్యా.

రష్యాలో దక్షిణ యుద్ధరంగమున, నీపరునదీ తీరమునగల నికలయెవ్ అను చిన్న రష్యను నౌకాశ్రయమును జర్మను సేనలు చుట్టుముట్టెనని 14 వ తేదిన జర్మనులు ప్రకటించిరి. నీపరునది నల్ల సముద్రమున కలియు చోట జర్మను సేనలు నల్లసముద్రతీరమును చేరెననియు, దానికి పడమటగానున్న ప్రాంతమును, రష్యను యుద్ధ నౌకాకేంద్రములలో నొకటగు ఒడెస్సా రేవును చుట్టుముట్టితిమనియు జర్మనులు దెలుపుచున్నారు. అయినను ఈ ప్రాంతమునగల రష్యను సైన్యమునందు అత్యధిక భాగమును నీపరునదికి తూర్పునకు సురక్షితముగ జేర్చితిమని రష్యను అధికారులు దెలిపిరి. 18 వ తేదీన జర్మను సైన్యములు ఒడెస్సా రేవును చుట్టుముట్టినపుడు రేవునందున్న 35,000 టన్నుల యుద్ధనౌక, 10,000 టన్నుల క్రూయిజరు, 4 డిస్ట్రాయర్లు, 2 జలాంతర్గాములు, 60 వేల సైన్యం, 84 టాంకులు, 530 ఫిరంగులు పట్టుకొనబడెననియు జర్మనులు 19 వ తేదిన ప్రకటించిరి. రష్యనులు ఈవార్త అసత్యమని ప్రకటించిరి. జర్మను సైన్యములు, నీపరునదీ తీరమునగల నీపరు ప్రోవోస్కు అను పెద్ద పారిశ్రామిక పట్టణముపైకి జనుచున్నవనియు జర్మను ప్రకటన దెలుపుచున్నది.

మధ్య రంగమున, స్మోలెన్స్కునుండి కొంత జర్మను సైన్యము తూర్పు-దక్షిణ మూలగా జని మాస్కో-కీవు రైలు మార్గమును చేదించుటకు ప్రయత్నించుచున్నవి.

ఉత్తర రంగమున రష్యను సైన్యములు లెనిన్‌గ్రాడునకు దక్షిణ-పడమర మూలగా 70 మైళ్లలోనున్న కింగ్‌సీప్ నగరమును ఖాళీచేసి లెనిన్‌గ్రాడు పరిసరములకు వచ్చిచేరుచున్నవి.

జర్మనులు దేశము నాక్రమించుటకంటె, అపారముగు రష్యను సైన్యమును ఆయుధసామగ్రిని పట్టుకొన జూచుచున్నారు. రష్యను లిపుడు దేశము ఖాళీచేయవలసివచ్చినను లక్ష్యపెట్టక, సైన్యమునకును ఆయుధసామగ్రికిని యెక్కువ నష్టము గలుగనంతవరకు పోరాడుచు తరువాత వెనుకకు తగ్గుచున్నారు. సైన్యమును కాపాడుకొనినయెడల కొలది రోజులలోనే అలసిపోవు జర్మను సైన్యములపైబడి వెడలగొట్టవచ్చునని రష్యనుల యుద్దేశము.

లెనిన్‌గ్రాడుపైనను, మాస్కోపైనను రోజును జర్మనులు విమానదాడులు సాగించుచున్నారుగాని, ఏవో వొకటి రెండు తప్ప శత్రువిమానములు ఆ నగర పరిసరముల భేదించుకొని, పట్టణమును ప్రవేశింపజాలకున్నవి. ఉత్తరమున బాల్టికు ప్రాంతమునుండి దక్షిణమున నల్లసముద్ర ప్రాంతమువరకును గల రంగమునందంతటను పోరాటము భయంకరముగనే సాగుచున్నట్టుల వార్తలు దెల్పుచున్నవి.

ఫిన్నిషు సైన్యములు ఉత్తరమున సోర్టావల్లా పట్టణమును ఆక్రమించెనని 16 వ తేదిన ఫిన్నిషు అధికారులు ప్రకటించిరి.

14 వ తేదివరకు జరిగిన పోరాటమున జర్మనులు 5 వేల టాంకులు గోల్పోయిరి. 11 డివిజనులు, 13 రెజిమెంటులు పూర్తిగ నిర్మూలమైనవి. 20 డివిజనులలో సగముకంటె యెక్కువమంది సైనికులు హతులైరి.

పోలండు-రష్య ప్రభుత్వములు 15 వ తేదిన పరస్పర సైనిక సహాయపు వొడంబడికను గావించుకొనెను.

## టర్కీ—ఈరాక్—ఈరాన్—సిరియా.

టర్కీయొక్క సరిహద్దులను, స్వాతంత్ర్యమును మన్నించెదమనియు, టర్కీపైన తమ కేవిధమగు దురాక్రమణోద్దేశమును లేదనియు, బ్రిటిషు-రష్యా ప్రభుత్వములు రెండును గలసి 12 వ తేదిన టర్కీ ప్రభుత్వమునకు సందేశము నందజేసెను. ఐరోపాయందలి దేశములలో నేదియైన టర్కీపై దాడివచ్చినయెడల తాము ఉభయులమును గూడ టర్కీ రక్షణకు సహాయమువచ్చెదమనిగూడ బ్రిటిషు-రష్యా ప్రభుత్వములు వాగ్దానమొసగెను. టర్కీ ప్రభుత్వము ఈ వాగ్దానమును అంగీకరించెను.

జర్మన్ ఏజెంటులు ఈరాన్‌నందు విశేషముగా చేరుతున్నారని అరోపించి, వారిని వెంటనే వెడలగొట్టవలెనని సోవియటు-బ్రిటిషు ప్రభుత్వములు రెండునుకలసి ఈరాన్ ప్రభుత్వమును రెండవసారి మరల గోరెను. అట్టుల వెడలగొట్టనిచో తామే తగు చర్య దీసుకొనవలసియుండుననిగూడ హెచ్చరించిరి. ఈరాన్‌లో తమకు విమానాశ్రయ సౌకర్యముల నొసగవలెననియు, పెట్రోలు నొసగవలెననియు లేనిచో రాజకీయ సంబంధములగూడ త్రెంచి వేసుకొనబడుననియు జర్మనీ ఈరాన్‌ను హెచ్చరించినది. పర్షియాలో జర్మనుల కుట్రలను గురించిన ఆరోపణల కేవలము కల్పితములని పర్షియను పత్రికలు ఎగతాళిచేయుచున్నవి.

సిరియా—లెబనాన్ రాష్ట్రములకు సంపూర్ణ స్వాతంత్రము నొసగు నుద్దేశమును ధృవపరచుకొనుచు, స్వతంత్ర ఫ్రెంచి నాయకుడగు డిగాలీ సేనానియు, బ్రిటిషు దేశీయాంగమంత్రి లిటిల్టన్‌గారును వ్రాసుకొనిన జాబులు 14 వ తేదిన ప్రకటింపబడెను.

## విషీ.

ఈ నెల 12 వ తేదీన మార్షలు పెటెయిన్, ఫ్రెంచి ప్రజలకు విజ్ఞప్తిచేయుచు, ఇకమీద ప్రజలందరును తనకే రాజభక్తి ప్రమాణ మొనర్పవలెననియు, తన యధికారములను ఉపప్రధానియగు అడ్మిరల్ డార్లన్‌కు యిచ్చితిననియు, ప్రజలందరును, ఫ్రెంచిజాతియొక్క ఈ విషమస్థితిలో, సంపూర్ణ సహకారమును గన్పరుపవలెననియు గోరెను.

విషీ ప్రభుత్వము, శత్రువగు జర్మనీతో సహకారమొనర్ప నిశ్చయించుకొని ఫ్రెంచిప్రజల ఆత్మగౌరవమును కళంకమొనర్చెనని స్వతంత్ర ఫ్రెంచి నాయకులు ఖండించిరి.

సిరియాలోని ఫ్రెంచి సైనికులను స్వతంత్ర ఫ్రెంచి సైనిక దళములలో చేరవలెనని కాట్రూ సేనాని నిర్బంధించుచుండెనని విషీ ప్రభుత్వము బ్రిటిషు ప్రభుత్వమునకు ఆక్షేపణపత్రము నందజేసెను.

ఫ్రాన్సునందలి ఉన్నత న్యాయస్థానమగు సెనెటు సభ్యులు 19 వ తేదీన పెటెయిను సేనానికి రాజభక్తి ప్రమాణమొనర్చిరి.

సిరియానుండి ఫ్రాన్సునకు గొనిపోబడిన బ్రిటిషు యుద్ధఖైదీలు తిరిగి సిరియాకు పంపివేయబడిరి.

ఇట్టి ఖైదీలను విడుదలచేయకుండ ఒడంబడిక షరతులను భంగపుచ్చినందులకు ప్రతీకారముగ, సిరియా హై కమిషనరగు డెంట్జు సేనానిని బ్రిటిషు అధికారులు నిర్బంధమునందుంచి, పాలస్థానమునందలి జెరూసలమునకు మార్చిరి.

## దూరప్రాచ్యము.

జపాను ప్రభుత్వమంత్రులలో నొకరును, మాజీ ప్రధానియుఅగు హిరనుమాగారిపై ఒక యువకుడు 14 వ తేదీన రివాల్వరు ప్రేల్చి హత్యచేయుటకు ప్రయత్నించెను. హిరానుమాగారు గాయములు తగిలి చికిత్సనందుచున్నారు. నేరస్థుడు పట్టుకొనబడెను. అతడు తీవ్రవాద యువజన సమితి సభ్యులలో నొకరని అనుకొనుచున్నారు.

ఆంగ్ల-అమెరికా దేశములు జపానుచుట్టును శత్రువర్గముల కల్పించి, జపానును అణచజూచుచున్నదనియు, కాని జపాను ఆ బెదరింపుల లక్ష్యముచేయక తా నదివరకు నిర్ణయించుకొనిన కార్యక్రమము నమలుజరుపుననియు జపాను అధికారి రేడియోలో ప్రకటించెను.

జపానునుండి 100 మంది అమెరికను పౌరులను ఖాళీచేయుటకు అనుమతినిగోరగా జపాను అధికారులు అనుమతిని నిరాకరించిరి.

సంయుక్తరాష్ట్రములు వ్లాడివాస్టక్ రేవు (రష్యా) నకు నౌకలలో ఆయుధసామగ్రిని పంపునెడల, జపాను వుపేక్షించియూరకొనజాలదని జపాను ప్రభుత్వ ప్రచురణశాఖోద్యోగియగు ఇషీగారు 19 వ తేదిన హెచ్చరించిరి.

ఇండో-చైనాకు 18 వ తేదిన మరికొన్ని క్రొత్త జపాను సైన్యములు వచ్చిచేరెను. ఇదివరకచట 160 వేల సైన్యమున్నట్టుల దెలుపబడెను.

చైనాకు సంయుక్తరాష్ట్రములు 8 లక్షల టన్నుల ఆయుధసామగ్రిని వెంటనే పంపుట కేర్పాటుల గావించెను.

చైనా రాజధానియగు చంకింగునగరముపై వారము రోజులు నిరంతరాయంగా జపాను విమానములు బాంబుల వర్షించెను. 14 వ తేదిన అవి ఆగిపోయెను.

థాయి దేశమును బ్రిటిషు అధికారులు బెదరించుచుండిరను జపాను ఆరోపణ పూర్తిగ అసత్యమని, మలయా యందలి బ్రిటిషు సర్వసేనాధిపతియగు సర్ బ్రూకు పాఫాంగారు ఖండించిరి.

జపాను, థాయి ప్రభుత్వమునకు కొన్ని షరతుల దెలిపి, వానికి 8 రోజులలో సమాధాన మొసగవలెనని అంత్యసందేశము నంపెనను వార్త అసత్యమని థాయి ప్రధాన మంత్రి 19 వ తేదిన ఖండించెను.

మంచూకో-రష్యా సరిహద్దున వివాదముల పరిష్కరించుకొనుటకు నియమించుకొనబడిన సంయుక్తసంఘము, ఒక యొడంబడికను సిద్ధపరచెననియు, సెప్టెంబరు 22 వ తేదిన దానిపై సంతకములు జరుగుననియు, రష్యా, మంచుకో అధికారులు ప్రకటించిరి.

సలహా: ఇకముందు చూచుకొనుటకు యీ మదరాసు యుద్ధ సంచికను మీరు భద్రపరచుకొనుడు.

[మదరాసు సమాచారముల డైరెక్టరుగారు తమ వందనములతో దీనిని మీకు పంపుచున్నారు.]

MADRAS : PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.